## నిజాంరాష్ట్రాంధ్ర మహాసభాధ్యక్షులు శ్రీ బూర్గు రామకృష్ణరావు B. A., LL, B. గారి యభిప్రాయము:—

" ప్రాచీన కాలమునుండి కర్మజ్ఞాన ప్రధానములగు మతములతోపాటు సార్వజనీనముగా పామరులకును సువిదితమై సులభసాధ్యమగు భక్తి ప్రధానమగు మతముగూడ ననేకరూపములలో గనపడుచున్నది. శైవ వైష్ణవ భక్తిసూత్రములపై యాధారపడిన నీ మతముల సంచాలనమునకు సిద్ధులు భక్తులు ఆళ్వార్లు కారకులు. వీరి ప్రాముఖ్యత దక్షిణ భారతమున ప్రాచీన కాలమున నుత్తరమునకంటె నెక్కువ కనుపడుచున్నది వీరిలో వర్ణ వివక్షతలేదు. స్త్రీలు పురుషులవలెనే భక్తురాండ్రై యాచార్య పదవులను బొందిరి. అస్పృశ్యు లనబడువారును పరమభక్తులై యుత్తమోత్తములగు శైవులును వైష్ణవులుగను పరిగణింపబడిరి. ఈ భక్తిమతమే సర్వసాధారణముగా ప్రచలితమై యాచరణలోనున్న హిందూమతము. వీరశైవమతము వీటిలో ముఖ్యమైనది. మిగుల ప్రాచీనమగు నీమతమును పురస్కరించుకొని, సాహసుడగు బసవేశ్వరుడు, జాతివిశిష్టతపై యాధారపడిన వర్ణకల్పనను తీవ్రముగా ఖండించుచు శుష్కవైదిక కర్మాచారములను నిరసించుచు హిందూజాతియందు సంజీవిని పోసెను క్రీ॥ శ॥ పన్నెండవ శతాబ్దమున దేశము రాజకీయముగా నతిహీనదశయందున్నపుడు బసవేశ్వరుడు జాతిమత విభేదములులేక సర్వజనులకు సులభముగా నాచరించుటకు యోగ్యమగు రీతిని వీరశైవమును పునరుద్ధరించి ప్రజాసామాన్యము నాకర్షించి హిందూధర్మమును రక్షించిన గొప్ప సంస్కర్త.

భక్తి ప్రధానములగు మతములన్నియు ప్రజాసామాన్యముయొక్క భాషకు ప్రాముఖ్యతనిచ్చి వీనియందే ప్రబోధము చేయవలసివచ్చినది. అట్టిప్రబోధము వలన మహోత్తరమైన క్రాంతిగలిగి అదియే నిప్పటికిని మనదేశముయొక్క ప్రజా బాహుళ్యమునకు జీవితధర్మ సూత్రములను లభింప జేయుచున్నది. బసవేశ్వరుడు కన్నడమున సులభముగను మనోరంజకముగను, బలికిన వచనములకొన్నింటిని తెనుగున ననువదించి యాంధ్రపాఠక లోకమున కందజేసిన శ్రీ రేకళిగమఠము వీరయ్య గారు మిగుల సంస్తవనీయులు. వీరీ ప్రయత్నమును కొనసాగించి 'బసవేశ్వర వచనముల'ను పరిపూర్ణముగా తెనిగించినచో చాల లాభకరముగా నుండును. గ్రంధకర్త గారిని హృదయ పూర్వకముగా నభినందించుచు వీరి ప్రయత్నములను పాఠకలోకము ధనసహాకారముచే సఫలమొనర్చునని యాశించుచున్నాను. "

# బసవవచనామృతము

బసవేశ్వరుని కన్నడవచనముల అనువాదము.

—:o:—

అనువాదకుడు

రేకళిగె మఠము వీరయ్య

---

కొండా శంకరయ్యగారి
ప్రీమియర్ ముద్రాక్షరశాల, శికింద్రాబాద్.

వెల ౦-౪-౦. 1941.

## సమర్పణము

---

శ్రీ రేణుకశాఖా శేకళిగె సంస్థానమఠాధ్యక్షులును,

మద్గురువర్యులును అగు

**శ్రీ శ్రీ సిద్ధరామ శివయోగులవారి**

చరణకమలములలో

నా యీ చిన్ని ప్రథమకృతి

భక్తితో సమర్పితము.

# కించిత్



పరమపవిత్రముగఁ దనకుఁ గన్పట్టిన వీరశైవమత మును స్వీకరించి, సేవించి, యద్భుతముగ నభివృద్ధి సేయుటలోఁ బ్రసిద్ధుఁడైన కల్యాణ బసవేశ్వరునిగూర్చి ప్రస్తుతము విస్తరింపఁ బనిలేదు. బసవని కెంతగాఁ బ్రచార మున్నను బసవఁడు స్వయ ముగ రచించిన వచనములను గూర్చి మొన్నటివఱకు లోకము నకు సరిగఁ దెలియదు. నలువది యేండ్లకుఁ బూర్వము బళ్లారి సెట్టి యొకఁడు దరిద్రంపు కాగితములలోఁ దప్పులు కుప్పలుగా ముద్రించిన బసవని కన్నడవచనములు కొంత ప్రచార మందినను, ఇటీవల విజాపురపు శ్రీ హళకట్టి ఫకీరప్పగారు ప్రకటించువఱకును నవి పండితుల నాకర్షింపలేదు.

బసవని మాతృభాష కన్నడము గావున నందే ఈ వచన ములు విరచితములైనవి. "బసవఁడు వీనిని వ్రాయలేదు. తరువాతి వా రెవరో వ్రాసి బసవని పేరునకుఁ దగిలించినారు. ఇందలి భాష ౧౨ వ శతాబ్దిపుది కాక యాధునికమై యున్నది" అను ఆక్షేపములును కలవు. బసవఁడే లపుడపుడు కొన్ని వచనములఁ బలికినటులు పూర్వగ్రంథప్రమాణములు లభించుచుండ, వచనముల యునికిని గూర్చి సంశయింపఁ బని లేదు. బసవనికి సన్నిహితుఁడైన మహాకవి పాల్కురికి సోమ నాథుఁడు తన పండితారాధ్యచరిత్ర దీక్షాప్రకరణమున మల్లికార్జున పండితారాధ్యుని శివపూజావైభవమును వర్ణిం చుచు నతఁడు మహిమ్న మలహణ హలాయుధాది పూర్వ స్తోత్రములను పారాయణ మొనర్చునెడ, శివతత్త్వసారాది

స్వకృతుల పరసముతోఁబాటు బసవని గీతములఁ జదివి యానందించినట్లు "బండారు బసవన్న భవ్యగీతములు" అను ద్విపదతో ధ్వనింపఁ జేసియున్నాఁడు. మఱియు నీ దీక్షాప్రకరణాంత్యమున బసవచరిత్రలో బసవని లింగార్చనావసరము లేఖకులు వచ్చి వచనముల లిఖింప నుద్యుక్తులగు సన్నాహమును, బసవన్న బల్కినటులును ఈ క్రింది యుద్ధరణము సాక్ష్యమిచ్చుచున్నది:—

"పెలువ్రందు పరిచారపుల ద్వారపాల
కుల నిజాప్తుల నియోగులఁ గరణముల
నరయుండు నేఁటి గీతావసరములు
సరసర గీత బండరు కవిలియలు
నరయుఁడు శోధింపుఁ డవ్వచనములు"

"అక్కజం బక్కజం బన బాసగీత
మొక్కఁ డానతియిచ్చె నొక్కింతమున్న"

"దట్టుఁడు బాసగీతం బానతిచ్చె"

—పండితారాధ్యచరిత్ర దీక్షాప్రకరణము.

పాల్కురికి సోమనాథుని ద్విపదబసవపురాణమునను బసవని గీతమును విని మడివేలు మాచయ్య యేలకో క్రుద్ధుఁడయ్యె నని కూడ గలదు.

"మఱి కొన్ని దినముల కఱలేక బసవఁ
డఱిముఱి నొకగీత మానతిచ్చుడును"

—బసవపురాణము, ఆ ౪.

వీని వలన బసవఁడు వచనముల రచించెననుట నిక్కవము. ఆ వచనము లెన్నియను ప్రశ్నమునకు సోమనాథుఁడే:—

"లాలితంబుగ నాల్గు లక్షలమీఁద
నోలి నర్వదినాల్గువేల గీతములు"

—బసవ పురాణము, ఆ ౪.

అని సమాధాన మిడినాఁడు. ఈ యాంధ్ర పురాణమునే కన్నడమున కనువదించిన భీమకవి:—

"భాళనయ నప్రతిమకరుణా-
లోలమానస నాల్కు లక్షద
మేలె తొంబత్తారుసావిర గీతసంకుళవ"

—భీమకవి కన్నడబసవపురాణ, ౨౧-౫౧.

అని ౪౯౬౦౦౦ ల సంఖ్యను చెప్పినాఁడు. ప్రాచీనుఁడైన సోమనాథుఁడు ౪౬౪౦౦౦౦ లనెను. ఇం దేది సత్యము? ప్రస్తుతము లభించిన "బసవేశ్వరన వచనగళు" అను పొత్తము భక్త, మహేశ, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యము లను వీరశైవ షట్స్థలములను, తదవాంతరస్థలములను బోధించునదై ౯౪౪ వచనములు గలిగియున్నది. గణనప్రకారము ఈ వచనములలోని మొత్తము అక్షరముల సంఖ్య దాదాపు ౯౮౦౦౦ అగుచున్నది. బసవఁడు ఈ షట్స్థలవచనములనే కాక 'కాలజ్ఞాన వచనములు' 'శిఖారత్న వచనములు' మున్నగు కృతులనుగూడ రచించినట్లు ప్రవాదము కలదు. ఎటు జూచినను సోమనాథుఁ డన్నటులు ౪౬౪౦౦౦ ల వచనములు మాత్రము రచితములు కాలే దనవచ్చును. బహుశః ౪౬౪౦౦౦ ల అక్షరములు గల వచనములను వచియించి యుండునని యూహింప వచ్చును. కాని ఇన్ని యక్షరముల సంఖ్యగల వచనములైనను నేఁ డుపలబ్ధము కాలేదు.

౧౨వ శతాబ్దమందలి కన్నడశిలాశాసనముల భాష కును, తత్కాలమున విరచితములైన ఇతరగ్రంథముల భాష కును సమానలక్షణములు కలవు. ఆ కాలముననే యుండిన బసవని వచనముల భాష, యాధునిక భాషవలె సరళముగా నున్నందులకుఁ గారణము లేకపోలేదు. సామాన్యులకు సహజ ముగఁ దెలియునటులు గూర్పవలయునను ఉద్దేశ్యముతోడనే కన్నడమున వచనముల పుట్టుకయై యుండును. బసవనికంటెఁ బూర్వమున నున్న తేదర దాసమయ్య మున్నగు వారును వచనముల విరచించిరి. ఇవి పరంపరగ నీ యెనిమిది వందల దీర్ఘకాలములో నెంతేని పరివర్తన మందియుండును. పద్య ములలోఁ గ్రొత్తవి చేర్పుటకు సామాన్యముగ వీలుండదు. గద్యములో నిది సులభము. అయినను నేఁటి బసవవచనముల లోని కృత్రిమములను గనిపట్టుట సుకరముగాదు. నూరారు ప్రాచీన ప్రతులను సంపాదించి పరిశోధింపవలసి యున్నది. ప్రస్తుతము కన్నడదేశమునఁ బ్రచారము నందిన పుస్తకము తోడనే సంతృప్తి నొందవలెను.

ఆంధ్రులకుఁ గొంతవఱకైనను దెలియఁజేయు తలంపుతో బసవని ౯౮౮ వచనములలోనుండి ౧౦౮ టిని అనువదించి, శ్రీ రే. మ. వీరయ్యగారీ పొత్తమును గూర్చి వీరశైవమత వాఙ్మయమునకుఁ జేయూత నొసఁగినారు. అనువాద విశేష ములు వారి 'పరిచయము' లోఁ దెలియగలవు.

మూలమగు కన్నడమును జూడవలె నను వారికిగాను బసవని ప్రథమవచన మీ క్రిందఁ బొందుపరచనైనది:—

"ఉదకదొళగె బైచిట్ట బయకెయ కిచ్చినంతిద్దిత్తు,
శశియొళగణ రసద రుచియంతె ఇద్దిత్తు,
ననెయొళగణ పరిమళదంతె ఇద్దిత్తు,
కూడలసంగమదేవర నిలవు కన్నెయ స్నేహదంతిద్దిత్తు"

దీని యనువాదము ఈ పొత్తములోను మొదటిదిగ నున్నది.

ఈ వచనముల నవలోకించు వారికి శివాగమములలో సుప్రసిద్ధమైన వీరశైవమతముయొక్క షట్ స్థలములు, అష్టావరణములు, పంచాచారములు మున్నగు ప్రాచీన తత్త్వములను బసవఁ డనువదించె ననియును, ఒక మతమును క్రొత్తగా స్థాపింప లేదనియును, జ్ఞానదేవు తుకారాము తులసీదాసు రామదాసులు మున్నగు భక్తిసాంప్రదాయికులకంటె నధికముగ బసవఁడు సర్వజనసమానతను, నీతిని, భగవద్భక్తిని, ప్రాణిదయాపర్వతమును, ఘోషించె ననియును ధీమంతులు సులభముగఁ దెలియఁగలరు. ఈ శ్రేయస్సు కొంత యనువాదకులకును జేరఁదగినదియె. బసవేశ్వరుని మూలవచనముల యభిప్రాయ మీ యాంధ్రానువాదములో శ్రద్ధతో రక్షింపఁబడినది. కావున నాంధ్రవ్యాకరణ దృష్టితో వాక్యరచనను సరిజేయుట ముఖ్యమని తలంపఁబడలేదు. ప్రయత్నము అల్పమైనను తెలుఁగు తల్లికిఁ గ్రొత్త సొమ్మని సులవుగ సంబరపడఁ దగును. బసవేశ్వరుని సంపూర్ణవచనగ్రంథము ఆంధ్రమునఁ బ్రకటింపఁబడు సుసమయమునఁ దెలుపఁదగు వైశద్యమును గలదు. సహృదయు లద్దాని నిరీక్షింతురుగాక!

25-8-1941
సికిందరాబాద్.

ఓమ్

# పరిచయము.

—— ০ ——

"చం. ప్రసవశరాసనాంతకుని పంపున మున్నవతార మొంది శ్రీ
బసవపురాణసంకథిత భక్తమణిగ్రథనైకసూత్రమై
వసుమతి వీరశైవ మభివర్ధన మొందఁగఁజేసినట్టి మా
బసవనమంత్రిఁ గొల్తు భవబంధురసింధువుఁ దాఁటఁగోరుచున్."

—పిడుపర్తి సోమనాథకవి.

బసవేశ్వరుని వచనములను జదువువారు, ఆ మహాత్ముని జనన కాలము నందుండిన దేశపరిస్థితులను, అతని జీవనచరిత్రమును, మరియు హిందూజాతియందు అత డొనర్చిన క్రాంతియును తెలియుట ముఖ్యావసరమని, ఆ విషయములను 'పరిచయము'నందు వ్రాయ దలచితిని.

మానవజాతి కల్యాణమునకై అప్పు డప్పు డవతరించెడి మహా పురుషులు, ఆయా కాలపు జనులయొక్క మానసిక, నైతిక, సామాజిక, ధార్మిక పరిస్థితులు చెడి తమ్ముద్ధరించునట్టి యొకని రాకకై నిరీక్షించుచుండు సమయమున, జన్మించుచుందు రనునది ప్రఖ్యాతవిషయము. అ ప్రకారముగనే క్రీ॥ శ॥ పండ్రెండవ శతాబ్దమునందు శ్రీబసవేశ్వరుడు జన్మించి నపుడు దక్షిణభారతము (కర్ణాటకము)నందు సామాజిక, నైతిక, ధార్మిక పరిస్థితులు చెడి యుండుటవలన మానవజాతి అవనతికి గురియచుండెను.

గుణ కర్మ స్వభావముల పై యాధారపడిన వర్ణవ్యవస్థకు బదులు జాతివిశిష్టమగు వర్ణకల్పన దృఢపడి యుండెను. బసవేశ్వరునికంటె పూర్వము జైనబౌద్ధమతస్థాపకులు జాతివిశిష్టమగు వర్ణకల్పనను ఖండించినను, బసవేశ్వరు డవతరించు నాటికి, ఆ మతములు శాఖోపశాఖలుగా విభజింపబడి హిందూధర్మమునందలి ప్రత్యేకశాఖలుగా మారియుండెను. కొంచము ఇంచుమించుగా బసవేశ్వరునికి పూర్వ సమకాలీనుడగు రామానుజుడు వివిధ జాతుల వారికి వైష్ణవమత దీక్ష యొసగినను, సమాజమునందు వారికి సమానమగు హక్కు బాధ్యతలను కల్పించి యొసగనందువలన వైష్ణవులయందు కూడా వర్ణకల్పనము పెరుగుచు ఉచ్చనీచభావనము నెలకొను చుండెను. భక్తిజ్ఞానోపాసనల నిరసించుచు శైవమత ప్రతికక్షులైయున్న జైనాది మతములయొక్కయు, మరియు కామ్యయజ్ఞ శ్రాద్ధతర్పణాది కేవల కర్మల నాచరించుచు శుష్కకర్మాసక్తులై క్రియా జ్ఞానైకతత్త్వములను విస్మరించిన స్మార్తాది మతముల యొక్కయు ప్రభావములవలన జనసామాన్యము ధర్మాటవియందు దారి దెలియక భ్రమించు చుండెను. ఆ కాలమునందు జరుగు ఉపదేశములు, మరియు గ్రంథరచనలు సంస్కృతభాషయందే ఎక్కువగా జరుగు చుండుటవలన, ప్రజాసామాన్యమునందు విచారక్రాంతి గలుగు నవకాశము లేకుండెను.

ఈ సమయమునందే పశ్చిమచాళుక్యచక్రవర్తియగు మూడవ తైలపదేవునికి సామంతుడుగా నుండి తర్దవాడి మొదలగు ప్రాంతముల నేలుచుండిన బిజ్జలుడు క్రీ॥ శ॥ ౧౧౬౨ వ సంవత్సర ప్రాంతమున, తైలపదేవు నోడించి, కల్యాణపట్ట

ణము నాక్రమించి, స్వతంత్రముగా రాజ్యపరిపాలనము జేయ మొదలిడెను. ఇట్టి రాజకీయక్రాంతివలన ప్రజాలోకము క్షోభ గొనియుండెను.

ఈ విధముగ దేశమునందంతటను రాజకీయక్షోభము, సామాజికమైన అవ్యవస్థ, నైతికావనతి, ధార్మిక కల్లోలములు నెలకొని యుండుటచే మానవసమాజము అధోగతి జెందుచుండెను; భారతదేశమునందు అనాదివీరశైవమతము క్షీణించుచు నామమాత్రావశిష్టమై యుండెను. అట్టి సమయమున బసవ మహాత్ముడవతరించి క్షీణమగుచున్న వీరశైవమతమును పునరుద్ధరణ మొనర్చుటయే గాక, హిందూజాతియం దొక గొప్ప క్రాంతిని గలుగ జేసె ననునది సుప్రసిద్ధచరిత్రాంశము.

ఆదర్శజీవుడగు బసవని జీవనచరిత్రను, హరిహరుడు, పాల్కురికి సోమనాథుడు, పిడుపర్తి సోమనాథుడు, భీమకవి మొదలగు పండితు లెందరో, ఆంధ్రకర్ణాటక భాషలయందు, పురాణ రూపముగా వ్రాసి తమ తమ భక్తికానుకల నిదివరకే సమర్పించి యుండుటవలన, తన్మహిమలను, మాన్యములగు సంఘసంస్కరణములను తెలియని వీరశైవు లరుదు. ఐనను ఆతని జీవనకథను సంక్షిప్తముగా, సర్వులకు తెలియవలయు నను యభిప్రాయముతో, వ్రాయుచున్నాను. బసవేశుడు బిజాపురము జిల్లాయందలి బాగేవాడియను గ్రామమునందు, శైవబ్రాహ్మణుడును, ఆగ్రామము నాయకుడును అగు మాదిరాజు మరియు నాతని ధర్మపత్ని యగు మాదలాంబిక గర్భమున క్రీ॥ శ॥ ౧౧౩౨వ సంవత్సరమున జన్మించెను. అతడు పుట్టగానే కనురెప్పలు విప్పక, నోరు దెరువక, రోదన మొనర్పక, కొంత సేపటి వరకటులే

పడియుండె ననియు; అంత కప్పడి క్షేత్రమునుండి, సంగమేశుని
యాజ్ఞవలన జాతవేదముని మాదిరాజు నింటి కేతెంచి, చింతా
క్రాంతులై యుండిన దంపతుల జూచి "ఈ శిశువు నందికేశ్వ
రుని వ్రతప్రభావమువలన జన్మించెను, గనుక ఈ శిశువునకు
బసవడని పేరు పెట్టు' డని యానతిచ్చుచు, "మేము మా
యిష్టార్థమును పూర్తి చేయుటకై ఈతని యిష్టార్థమును పూర్తి
చేయు ఇష్టలింగమును ధరించు చున్నా" మని ఆ శిశువును
(బసవని) ఎత్తి ముద్దాడి కంఠమున ఇష్టలింగ ధారణ మొనర్చి
కూడల సంగమ క్షేత్రమునకు జనినట్లు పురాణ ప్రసిద్ధిగలదు.

ఈ ప్రకారముగా బసవేశుడు పుట్టగానే లింగధారియై
తలిదండ్రుల ప్రేమతో దినదినప్రవర్థమాను డగు చుండగా;
ఐదవ ఏడు రాగానే, అతని తండ్రి అక్షరాభ్యాసమునకు
బంపెను. అతడు అచిరకాలముననే కన్నడ సంస్కృత భాషల
యందు పాండిత్యము నార్జించుటయే కాక, వేదాగమోపని
షత్తులయందలి గహన మగు వేదాంతతత్త్వముల సమన్వ
యించు శక్తిని కూడా సంపాదించుటవలన, అత లోక అమర
ధ్యేయసాధనకై యవతరించిన అతిమానవ వ్యక్తియనియును;
మాదలాంబిక నందికేశ్వరుని పూజించి అతనిని కనినందు
వలన, నందికేశ్వరుని యవతారమనియును జనులు భావింప
దొడగిరి.

మాదిరాజు బసవని కెనిమిదవ యేట ఉపనయన సంస్కార
మొనర్ప దలచి శుభముహూర్తమున పురోహితుల రావించి
సంస్కారప్రయత్నముల నారంభించెను. కాని, జ్ఞానభండారి
యగు బసవడు "తండ్రీ! నాకు ఇంతకు పూర్వమే నా గురుడగు

జాతవేదముని శివదీక్ష యొసగి ఇష్టలింగ ధారణ మొనర్చెను. కనుక నేను ఒకటే జన్మమునందు భోగమోక్షముల నొసగు నట్టి ఇష్టలింగమును విడిచి, శుష్కమైన కర్మరమార్గము ననుసరింప జాల" నని ఉపనయనసంస్కారమును ఖండితముగా నిరాకరించుచు, సత్య శోధనకై మాతృ, పితృ, బాంధవుల నెల్ల విడిచి; ధన, కనక, వస్తు, వాహన, గృహ, గ్రామాదుల నన్నిటిని త్యజించి:

"తండ్రివి నీవు, తల్లివి నీవు, బంధువు నీవు, బలగము నీవు,
నీవు గాకింకెవ్వరు లేరయ్యా! కూడలసంగమదేవా,
పాల ముంచుము నీట ముంచుము"

యనుచు కృష్ణామలాపహారుల సంగమస్థలమగు కూడల సంగమ క్షేత్రమున కేగెను.

అత డచ్చట తన గురువగు జాతవేద మహాఋషిని భక్తిశ్రద్ధలతో సేవించుచు ధర్మ, నీతి, సమాజ, రాజ్య శాస్త్రములయందు నిపుణు డగుటయే కాక శివానుభవ జ్ఞానమును కూడా నార్జించుచు, యాత్రికులకు లింగతత్వమును, శివానుభవజ్ఞానము నుదేశింప మొదలిడెను. బసవేశుడు సుమారు ఇరువది సంవత్సరముల వయస్సు వరకు, బ్రహ్మచర్య పాలన జేయుచు, గురుకులవాసము జేయు సమయముననే అతని విద్యా నైపుణ్యము, ఆచారశీలత, తత్వజ్ఞానముల యొక్క విఖ్యాతి కర్ణాటక దేశము నందంతట వ్యాపించెను, బసవని తలిదండ్రులు మరియు అతని మేనమామ యగు బలదేవుడు, అతని కీర్తిని విని, ఆనందమగ్నులై వివాహ పాశముతో నతని బంధించి తమ వంశలతను పెంచ దలచిరి. బలదేవుడు

బిజ్జలుని రాజ్యమునందు ప్రధాన మంత్రియై పుత్రసంతానము లేక, ఏక పుత్రిక గలవాఁడై యుండెను. అతఁడు తన కుమార్తెను బసవని కొసఁగి ధన్యుఁడు కాఁదలంచి, కూడలసంగమ క్షేత్రము నందుండు, జాతవేదముని సన్నిధి లో "నా మేనల్లుఁడగు బసవ దేవునకు నా కూతురు నిచ్చి వివాహము చేయ దలచితి" నని విజ్ఞాపన పత్రిక నంపెను. జాతవేదుఁడా పత్రికను చూచి, బసవఁడు సంసార విముఖుఁడైనను, ఆతనికి-"సంగమేశుని సంకల్పము వలన గలిగిన, ఈ సుసంధిని వదలక దీనివలన నీ తత్త్వములను ప్రకాశింప జేయుచు క్షీణించుచున్న వీరశైవమతమును పునరుద్ధరణ జేయు మ"ని ఆజ్ఞాపించెను. బసవదేవుఁడు గురు నాజ్ఞ నతిక్రమింపక బలదేవుని కూతు రగు గంగమాంబికను పెండ్లి యాడెను:

"నేను వ్యవసాయ మొనర్తు నయ్యా గురుపూజకని,
నేను వ్యవహార మొనర్తు నయ్యా లింగార్చన కని.
నేను పరసేవ యొనర్తు నయ్యా జంగమదాసోహమున కని.
నే నేయే కర్మల జేసినను,
ఆయా కర్మల ఫలభోగము నీవే యొసగెద వనునది యెరుఁగుదు.
నీ వొసగిన ద్రవ్యము నీకు గాక మరొకరి కీయను.
నీ సొమ్ము నీకు జెంద జేసెద, నీ యాన, కూడలసంగమదేవా."

యనుచు, బిజ్జలుని కొలువుకూటమునందు జేరెను.

బలదేవుని మరణానంతరము, బిజ్జలుఁడు బసవని యోగ్యతను, వివిధ విద్యల యందుగల నిపుణతను, తెలివి తేటలను జూచి బలదేవుని స్థానమునందు ప్రధానామాత్యునిగా నియమించెను. ఈ ప్రకారముగా బసవదేవుఁడు ఒక

గాప్రిమాధికారియగు మాందిరాజు నింటియందు జన్మించినను, తన స్వయం ప్రకాశమువలన కలచూర్య సంస్థానాధీశు డగు బిజ్జలమహారాజు కొలువుకూటమునందు ప్రధానమంత్రిత్వమును సంపాదింప గలిగెను.

బసవ సచివుడు గురుకులవాసమునందు నేర్చిన వివిధ శాస్త్రముల పరిచయమువలన తనకుగల అనుభవజ్ఞానమువలన రాజ్యపరిపాలనమును, న్యాయవిచక్షణతను విజయవంతము గాను, నిష్పక్షముగాను జరుపుచుండె ననుటకు అతని మంత్రిత్వకాలమునందు పరరాజుల దాడులుగాని, అంతఃకలహములు గాని లేక రాజ్యమునందు సుఖశాంతులు నెలకొని యుండుట యే సాక్షి.

బసవేశుడు సామాన్యమానవునివలె ముఖ్యమంత్రిత్వము దొరికిన పిదప వైభవానందములందు తులదూగుచు తన జీవిత కార్యము ముగించెనని తలంపక, రాజకార్యములతో బాటు మానవజాతి కల్యాణమును, వీరశైవమతోద్ధరణమును గూడ తన ముఖ్యకర్తవ్యముగా భావించి, అధికార బలముల నుప యోగించక, కేవలము సేవాభక్తులతో, తనుమనోధనములను వంచనలేకుండ సమర్పించుచు, ఆత్మీయాకర్షణశక్తితో, వీర శైవమతమును సంస్కరించి విస్తరింప మొదలిడెను.

బసవమహాత్ముడు, వీరశైవమతతత్త్వములను జనులకు బోధించుటకై జాతిమత భేదములులేక, సర్వులు ప్రవేశించు నటులు 'అనుభవమంటపము'ను స్థాపించగానే, విప్రుడు మొదలు కొని అంత్యజునివరకు, జనులు తండోప తండములుగా బసవని

అనుభవ మంటపమున జ్ఞానోపదేశమును బొందుచు వీరశైవ మతమునందు చేరదొడగిరి. ఇంతకు పూర్వము శూద్రులనియు, అస్పృశ్యులనియు, ఉచ్ఛవర్ణములవారిచే దూరీకరింపబడిన వివిధవృత్తులవారందరు వేనవేలు బసవని శరణుజొచ్చి వీరశైవ మతదీక్ష బడసి శివశరణుల శ్రేణియందుజేర మొదలిడిరి. బసవని మహిమలు విని, అతని ఉదాత్త తత్త్వములకు మనసు కరిగి (కాశ్మీరదేశము మొదలుకొని కన్యాకుమారి వరకు) ఆయా ప్రదేశముల నుండివచ్చు సకలేశమాదరసు, ఆదయ్య, సిద్ధరామ శివయోగి, అల్లమ ప్రభు, అక్కమహాదేవి, మొదలు గాగల శివ శరణులకు బసవప్రభు వెల్లప్పుడును:

"తల్లిని బాసిన శిశువు తన తల్లి రాకకై ఎదురుచూచు నటులు,
త్రోవ తప్పిన దూడ తన మందకై ఎదురుచూచు నటులు,
నేను నీ శరణుల రాకకై ఎదురు చూచు చుందును.
సూర్యుని కిరణములు సోకినంత, కమలములు వికసించు నటులు
శరణుల జూచి నే సంతసించెద నయ్యా!"

యని స్వాగత మొసగు చుండెను.

వీరశైవ మతము దినదినాభివృద్ధి నొందుచు సుసంఘటితమగు నొకగొప్ప సమాజరూపము దాల్చుటయును, బసవేశుడు జాతివిశిష్టమగు వర్ణకల్పనను ఖండించుచు, బ్రాహ్మణుడగు మధువయ్య కూతురిని అస్పృశ్యుడగు హరళయ్య కొమారుని కిప్పించి (నూతన వీరశైవు లగుటచే) వారిద్దరికి గల ధర్మ సంబంధమును శరీర సంబంధముతో ధృడ పరచుటయును, బిజ్జలుని సంస్థానమునందుండిన కొండె మంచెన్న మొదలగు బసవ విరోధులు, జూచి సహింపక బిజ్జలరాజునకు బసవనిపై

నై మనస్సు గలుగునటులు దుర్బోధల నొనర్చిరి. అప్పుడు బస వేశునకును, బిజ్జలునకును వివాదము పెరిగి భిన్నాభిప్రాయము లేర్పడెను. బిజ్జలుడు మతపాక్షిక దృష్టితో, హారళయ్య మధు వయ్యలకు అన్యాయముగా ఉరిశిక్షల నొసగుట చూచి బసవే శ్వరుడు ఇట్టి ఘోరమగు అన్యాయమును సహింపక మంత్రి పదవిని తృణీకరించుచు, క్రీ॥ శ॥ ౧౧౬౮ వ సంవత్సరమున, మరల కూడలసంగమ క్షేత్రమున కేగి—

"నొచ్చితి నయ్యా, చిచ్చున బడితి నయ్యా
తెర వొసగు మయ్యా, తండ్రీ!
బసవడు వచ్చెను........................"

యనుచు కూడలసంగి మేశుని ప్రార్థించుచు లింగైక్య మయ్యెను.

ప్రపంచమునందు జరిగిన క్రాంతుల నన్నిటిని విమర్శా త్మక దృష్టితో జూచినచో వానిని, సత్త్వ-రజస్-తమో గుణ ములతో త్రివిధముగా విభజింప వచ్చును. మానవజాతికల్యా ణమునే ప్రధానముగా గ్రహించి చేయబడు క్రాంతి సాత్త్వక మనియు; ఏదైన నొక జాతి, లేక రాష్ట్రమును ప్రధానముగా గ్రహించి చేయబడు క్రాంతి రాజస మనియు, వ్యక్తిగత మగు క్రాంతి తామస మనియు జెప్ప వచ్చును. ఈ ప్రకారముగా మన భారతదేశమునందు మానవజాతికల్యాణమునకై తమ సర్వస్వములను అర్పించి, సాత్త్వక క్రాంతిని బుట్టించిన అఖండ యశస్సు క్రీ॥ పూ॥ ఆఱవ శతాబ్దమునందు బుట్టిన బుద్ధదేవుని తదుపరి ఒకేసారి క్రీ॥ శ॥ పన్నెండవ శతాబ్దము నం దవతరించిన బసవదేవునికే జెందెను. ఏనను తత్త్వముల

యందు బుద్ధునికన్న బసవేశుడు ముందుకుసాగి యుండెను. ఆ కాలమునందు ప్రబలియుండిన దురాచారములను ఖండించుచు, అతడు మానవజాతి కుపదేశించిన ముఖ్య తత్త్వముల యందు కొన్నిటిని పాఠకుల కెఱింగింప దలచి ఇచ్చట వ్రాయుచున్నాను.

బసవేశ్వరుడు అనేక దేవోపాసనమును, క్షుద్ర దేవతారాధనమును ఖండించుచు,

"దేవు డొకడు, నామము లనేకము.
పరమ పతివ్రితకు పతి యొకడు,
ఇతరులకు తల యొగ్గిన చెవి ముక్కును
గోయును..............."

"ఇద్దరు ముగ్గురు దేవతలని, ఉబ్బియుబ్బి మాట లాడకుము.
దేవు డొక్కడే చూడు సుమీ!
ఇద్ద రనునది అబద్ధము.
కూడల సంగమదేవుడుకాక, వేరే దేవుడు లేడనెను వేదము."

"మారెమ్మ మైసమ్మ లనునవి వేరే లేవు తెలియుడి!
మారెమ్మ యనగ నేమి?
దృష్టి తప్పి చూచిన మారెమ్మ, నాలుక తప్పి నుడివిన మారెమ్మ.
మా కూడలసంగని స్మరణ మరిచిన మారెమ్మ."

యనుచు ఏకేశ్వ రోపాసనమును సమర్థించుచు కేవల కర్మర మార్గమును, భక్తిజ్ఞానహీనము లగు పశుకర్మలను ఖండించుచు,

"గీతము పాడిన నేమి? శాస్త్ర పురాణముల వినిన నేమి?
వేదవేదాంతముల జూచిన నేమి?

మనముతో లింగజంగమములఁ, బూజింప నరయనివా ర
న్నిటి యందు దనుభవము గలవారైన నేమి?
భక్తిలేనివారి నొల్లఁడు కూడలసంగమదేవుడు."

"నాద ప్రియుఁడును గాఁడు, వేద ప్రియుఁడును గాఁడు,
భక్తి ప్రియుఁడు మా కూడలసంగమదేవుడు"

"లింగమును పూజించి ఫల మే మయ్యా?
సమరతి సమకళ సమసుఖమును అరయ కున్న,
లింగమును పూజించి ఫల మే మయ్యా?
కూడలసంగమదేవుని పూజించి,
నదిలో నది గలిసినటులు గాక యున్న?"

యనుచు జ్ఞానప్రదములగు సత్కార్యములను సమర్థించుచుఁ ధర్మము పేరిట జేయ బడుచుండెడి హింసామయములగు యజ్ఞయాగాది క్రియలు మోక్షదాయకములు కావని ఖండించెను.

"నుడివిన నుడుగుల నమ్మి నన్ను చంపెదరని,
ఓ మేకా, దుఃఖ పడితివా! వేదమును జదివిన
వారి యెదుట దుఃఖింపుము. శాస్త్రమును
వినినవారి ఎదుట దుఃఖింపుము. నీ వేడ్చి నందులకు
దగురీతి చేయును కూడలసంగమదేవుడు."

"దయలేని ధర్మ మ దేదయ్యా?
దయయే కావలయు సకలప్రాణులలో నెల్ల.
దయయే ధర్మమునకు మూలమయ్యా!
కూడలసంగయ్యా అట్లు గానివారిని ఒల్లడయ్యా."

యని సర్వజీవదయాపరత్వమును గూడ బోధించెను.

జన్మవిశిష్టమగు వర్ణకల్పన దృఢపడి యుండుట వలన, వివిధవృత్తులు వివిధజాతులుగా మారియుండెను. ఒక వృత్తి శ్రేష్ఠమైన దనియును మరొకటి నికృష్ట మైనదనియును జనులు భావింప దొడగిరి, మరియు ప్రతివారు (ముఖ్యముగా ఉచ్చ వర్ణములవారు) ఇతరవృత్తుల జేయుట తమ కవమానకరంబని తలంచు చుండుటవలన యెన్నియో ఆర్థికనష్టములు కలుగు చుండుట చూచి బసవేశ్వరుడు,

"కాచి కమ్మరియయ్యె. ఉదికి చాకలియయ్యె"
నేసి సాలెయయ్యె వేదము జదివి విప్రుడయ్యె"
కర్ణమునం దుండి జనించిన వారు గలరా?"

యని మానవ జీవితమున కావశ్యకము లగు అన్ని వృత్తులు సమానమర్యాద గలవని బోధించెను. మరియు,

"సెట్టి యందునా సిరియాళుని?
మడివాలు డందునా మాచయ్యను?
మాదిగ యందునా చెన్నయ్యను?
డోహరు డందునా కక్కయ్యను?
నేను బ్రాహ్మణుడ ననిన
కూడలసంగయ్య నగునయ్య."

"చంపు నతడే మాదిగ.
మలినమును దిను నతడే మాల. కుల మేమో?
ఎవరి కుల మేమో?

సకల జీవాత్మలకు క్షేమమునే కోరు
మా కూడలసంగని శరణులే కులజులు"

"చతుర్వేది యైన నేమి? లింగరహితుడే మాల.
శ్వపచుడైన నేమి? లింగ ధారియే వారణాసి.
...... ..........................
కూడలసంగమదేవుని తెలిసి పూజించి నతడు,
షడ్దర్శనముల కన్న అధికుడు.
జగమునకు పావనుడు చూచితివా?"

యనుచు, వీరశైవులందు జాతివిశిష్టమగు తారతమ్యమును బోనాడి, సర్వసమానత, సర్వసహోదరభావన మొదలగు సిద్ధాంతముల బోధించెను. బసవేశుడు ఈ సిద్ధాంతములు కేవల తాత్త్వక దృష్టితోనే కాక సామాజిక దృష్టితో గూడా స్థిరపడవలయు నని, మధువయ్య యను బ్రాహ్మణుని కూతు రను హరళయ్య యను అస్పృశ్యుని కుమారున కిప్పించి జాతి భేదముల రూపు మాపు ప్రయత్నమే కాక అస్పృశ్యతను నివారించుటకై కూడా క్రియారూపక ప్రయత్న మొనర్చెను.

బసవేశ్వరుడు, బుద్ధుడు మొదలగు అచ్చ వేదాంతుల వలె, ప్రపంచ పరమార్థముల రెంటిని భిన్నముగా జూచి పర మార్థమును గోరువారు ప్రపంచమును విడువ వలయు నని బోధించక.

"మర్త్య లోక మనునది కర్తయొక్క కర్మ శాలయయ్య
ఇక్కడను చెల్లువా రక్కడను చెల్లుదు రయ్య.
ఇక్కడ చెల్లని వారక్కడను చెల్లరయ్య కూడలసంగమదేవా!"

యని ప్రపంచమునందు సన్మార్గ ప్రవర్తనులై యుండువారు ఇహపరముల రెంటిని సాధింప గలుగుదు రని బోధించుటయే

కాక ప్రతి వీరశైవుడును స్వయం కృషిచే సంపాదించి గురు లింగజంగముల సంతృప్తి పరచుచుండ వలయు ననియు; వీర శైవులు భవుల (వీరశైవేతరుల) చే చేయబడిన వస్తువుల వాడకూడ దనియు; అవి నిషిద్ధము లనియు బోధించెను. దీని వలన జనులు వివిధవృత్తులయందు పేరుగాంచి స్వతంత్రజీవన మొనర్చు చుండుట యేకాక సమాజమునందన్ని పనులు సుసూత్రముగా సాగి దేశమునం దంతట ఆర్థికాభి వృద్ధి యయ్యెను.

బసవేశ్వరుడు స్త్రీల విషయమై ఉన్నతభావములు గల వాడై, పురుషులవలె స్త్రీలు గూడా శివ దీక్షను బొంది శివ సాయుజ్యు లగుట కర్హులని బోధించుచు అనుభవమంటపమున జరుగు ధర్మచర్చలయందు పాల్గొనునట్టి స్వాతంత్ర్యము నొసగెను. కనుకనే అక్కమహాదేవి, ముక్తాయక్క, కదిరె రెమ్మవ్వ, నీలాంబిక, గంగాంబిక మొదలగు అనేక శివశరణులు అనుభవ మంటపమునందు జరుగు ధర్మచర్చలలో పాల్గొను చుండుట యే కాక తమ తమ వచనములవలన మానవ జాతికి మార్గదర్శకు లైరి.

బసవేశ్వరుడు, కపటము, దురాగ్రహము, చౌర్యము, పరస్త్రీపరద్రవ్యములయందలి వ్యామోహములు, మద్యపాన మాంసాహారము, మొదలగు దురాచారములు కూడదనుచు:

దొంగిలింప బోకు, హింసింప బోకు, అబద్ధ మాడ బోకు,
కోపపడ బోకు, అన్యుల జూచి అసహ్య పడబోకు,
తన్ను వర్ణించు కొన బోకు, ఎదురు తిట్ట బోకు,

ఇదియే అంతరంగ శుద్ధి, ఇదియే బహిరంగ శుద్ధి
ఇదియే మా కూడలసంగమదేవుని మెప్పించు విధము"
"ఏటి యందు మునుగు అన్నలారా!
ఏటి యందు మునుగు స్వాములారా!
వదలు కొనుడి! వదలు కొనుడి!!
పరనారీసంగమము వదలు కొనుడి!
పరధనాపేక్షను వదలు కొనుడి!
వీనిని వదలక యే నదియందు మునిగినను
రాగల పుణ్యము రాదు, కూడలసంగమదేవా."
"లోన కుటిలము, పైన వినయమును జూపి
భక్తు లనుపించుకొను వారి నొల్లడయ్యా లింగదేవుడు."
"కన్న భక్తు లందరికి కేలు మోడ్చు నతడే భక్తుడు.
మృదు వచనములే సకల జపములు.
మృదు వచనములే సకల తపములు.
సద్వినయమే సదాశివుని వలపు.
కూడలసంగయ్య అట్లు గాని వారిని ఒల్లడయా!"

యని యనేక ఉన్నతములగు నీతిమార్గముల బోధించుచు:

"పుట్టను గొట్టిన పాము జావ గలదా?
అయ్యా! అఘోరతప మొనర్చిన నేమి?
అంత రాత్మ శుద్ధిలేని వారి నెటులు నమ్మ నయ్యా,
కూడలసంగమదేవుడు!"

యని అంతరంగ శుద్ధి లేనివారి జపతపోనియమము లన్నియు నిష్ఫలము లని బోధించెను.

ఈ ప్రకారముగా బసవేశ్వరుడు వీరశైవ మతోద్ధరణ జేయుచు నేడు భారతదేశమునందు ముఖ్యావసరములని పరిగణింపబడు అనేక సామాజిక, ధార్మిక, ఆర్థిక, నైతిక సుధారణలను సుమారు ౮౦౦ సంవత్సరములకు పూర్వము ఆచరణయందు తెచ్చుచు మానవ జాతియొక్క సర్వాంగోన్నతికై అవిశ్రాంత శ్రమతో పరిశ్రమించెను. కనుకనే పౌర్వాత్య సంస్కృతి చరిత్రయం దధికార వాణిగల సర్. జేమ్సు క్యాంబల్ గారు "The present day social reformer in India is, but speaking the language and seeking to enforce the mind of Basawa." యని ఆ మహాత్ముని సమాజ సుధారణల విషయమై వ్రాసిరి.

ప్రొఫేసర్ వాడియాగారు బసవని తత్వములకు మరులు జెంది "Back to Basawa" యను దుంధుభిని ప్రయోగించిరి, మరియు "టైమ్సు ఆఫ్ ఇండియా" పత్రిక తా॥ ౧౭-౫-౧౯౧౮ వ సంచిక యందు ఆ మహానుభావుని విషయమై ఈ ప్రకారముగా ప్రకటింప బడినది:-

"It was the distinctive feature of his mission, that, while illustrious religious and social reformers in India before him had each laid his emphasis on one or another items of religious and social reform, either subordinating more or less other items to it, or ignoring them altogether, Basawa sketched and boldly tried to work out a large and comprehensive programme of social reform with the elevation and independence of womanhood as its guiding point."

('Times of India" 17—5—1918.)

మైసూరు సంస్థానము పూర్వపు కౌన్సిలరులైన రైట్. వా. సర్. కే. పి. పుట్టణ్ణశెట్టి Kt. C I E. గారు ౧౯౧౭ వ సంవత్సరము సందు సోలాపురములో జరిగిన ఎనిమిదవ అఖిల భారత వీరశైవ మహాసభయందలి తమ అధ్యక్షోపన్యాసము నందు "Basaveshwara was truly a great social and religious reformer, not inferior, I should say, to the immortal Buddha, the star of the East". యని బస వేశ్వరుని విషయమై వచించిరి. ప్రొఫెసర్ రానడేగారు "His Vachanas form universal literature and he a universal personality" యని ఆ మహాత్ముని వచనముల గురించియు మరియు అతని వ్యక్తిత్వమును గురించియు వ్రాసిరి.

మహాత్మా గాంధిగారు ౧౯౨౪ వ సంవత్సరమున బెళగామ్ సందర్శించిన ఉపన్యాసమున "నేను వీరశైవులకు చెప్ప వలసిన దేమియు లేదు; నేను వారికి చెప్పవలసినదంతయు వారి ధార్మిక మహాపురుషుడగు బసవేశ్వరుడు ౮౦౦ సంవత్సరము లకు పూర్వమే చెప్పి పోయినా" రని వచించిరి. వేయేల మనము ఆ మహాత్ముని జీవన చరిత్రను తాత్త్విక దృష్టితో చూచిన 'భక్తి భాండారి బసవణ్ణనవరు' యను కన్నడ గ్రంథ మును రచించిన శ్రీమాన్ ఎం. ఆర్. శ్రీనివాస మూర్తి B. A. గారి వాక్యముల యందు, "బసవేశ్వరుడు వీరశైవులకు మాత్రమే సంబంధపడిన వాడు కాడు; కర్ణాటక దేశమునకు మాత్రమే సంబంధపడిన వాడుకాడు; ఆయన భరతఖండమున కంతటికిని, ప్రపంచమున కంతకును సంబంధపడిన మహాపురుషు డని" చెప్పక తప్పదు.

బసవేశ్వరుడు తన హృదయాంతర్గతములగు మత తత్త్వములను, ఆచార పద్ధతులను, సాంఘిక సుధారణలను, గ్రంథ రూపమునగాని, కావ్యరూపమునగాని వ్రాయక పామర జనులకు సైతము తెలియునటులు, నిత్యానుభవముగల ఉపమానములతో, దేశభాషయగు కన్నడలో, సులభ శైలితో, వచన రూపముగా వచించెను. ఆతని వచనములు సభల యందుపన్యసింప బడు ఉద్రేక పూరిత వాక్యములవలె గాక, భక్తి శ్రద్ధా జ్ఞాన వైరాగ్యములతో కూడుకొని యున్నవి. మరియు అవి చదువు వారికి, వట్టి వేదాంతవిషయముల బోధించు చప్పటి వాక్యముల వలె, విసుగు బుట్టించక, చదివిన కొలది మనోరంజకమును, ఆనందమును గలుగజేయును. తత్త్వము, భావము భాషాదృష్టులతో వాని కవియె సాటి. బసవేశుడు తన వచనములచే జనులకు జ్ఞానోపదేశ మొనర్చుట యే గాక కన్నడ నుడితల్లికి అసమాన సేవ యొనర్చెను. కావుననే ఆలూరు వేంకటరావుగారు ఆ మహాత్ముని 'కన్నడభాషా జనకుడ'నిరి. బసవేశుని వచనములు కర్ణాటక సాహిత్యమునందు, సాహిత్య దృష్టితో, గొప్ప మర్యాదను బొంది భక్తిజ్ఞానవైరాగ్యములను తెలిసికొనువారి కవి అవశ్య పఠనీయములని పరిగణింప బడుచున్నవి. ఇంత యే కాక నేడు బసవేశ్వరుడు మరియు ఆతని సమకాలీనులగు అల్లమ ప్రభువు అక్కమహాదేవి, చెన్న బసవేశ్వరుడు మొదలగు శివశరణులయొక్క వచనములను 'కర్ణాటక కవిచరితె'ను వ్రాసిన రావుబహాద్దూర్ ఆర్. నరసింహాచార్యులు "కన్నడ ఉపనిషత్తు"లని వ్రాసిరి. గనుకనే ఆ తత్త్వజ్ఞాని వచనముల యనువాదము మరాఠి,

హిందీ, ఇంగ్లీషుభాషల యందు చేయబడుటయే కాక పరదేశ భాషలగు జపాను, ఫ్రెంచి భాషల యందు కూడా చేయ బడు చున్నదని తెలియు చున్నది.

ఇట్టి ప్రాముఖ్యత గల బసవని వచనములు ఆంధ్రమున భాషాంత రీకరింపబడ నందువలన ఆంధ్రు లా మహాత్ముని వచనామృతమును పాన మొనర్చ జాలకుండుటయె కాక ఆ మహోదయుని తత్త్వముల దెలియుటయు సంభవింపదయ్యెను. గనుక, శ్రీ రావుబహాద్దూరు పి. జి. హాళకట్టి B. A., LL. B. గారు ప్రకటించిన "బసవేశ్వరుని వచనముల "నుండి ౧౦౮ టిని ఆంధ్రీకరించి ఆ మహానుభావుని జన్మ దినమగు నేడు ప్రక టించి, ఆంధ్ర సోదరీ సోదరుల కందజేయ దలచితిని. కాని ఈ తలంపు నా కెంత సులభముగా గలిగెనో, అంత కష్ట తరమని తోపసాగెను.

కన్నడ వచనముల నాంధ్రీకరించుటకు ఉభయ భాషా పాండిత్యమును; భావ ప్రదర్శనమునకు అప్పటి పరిస్థితులు తెలియునటులు చారిత్రిక జ్ఞానమును; అందలి యున్నతమైన వేదాంత నీతి ధర్మ తత్త్వముల ప్రకటించుటకు శాస్త్ర పరిజ్ఞాన మును, ముఖ్యముగ కావలసి యున్నవి. వానిలో నొకదాని యందైనను నాకు ప్రవేశము లేనందు వలనను; వందల కొలదిగ నున్న ఆ వచనములలో నుండి కొన్నిటిని మాత్రమే ( ఆతని తత్త్వములన్నియు పాఠకులకు తెలియునటులు ) ప్రస్తుతము సంగ్రహింపవలసి యుండుట వలనను కష్ట తరముగ నండెను.

ఈ వచనములు గద్యరూపముగా నున్నను వీటి

యందు కొన్నిచోటులలో పద్యముల (దాటి) వరుస యున్నది. వీనిని రాగతాళములతో కూడా పాడు అలవాటు నేను కన్నడ దేశమున ప్రచార మగుచున్నది. ఆ వచనముల యందున్న న్నియతక్రమములే వచ్చునట్లు తెలుగున ననువదింప జాలకున్నను, కన్నడ సాహిత్యమునందు విశిష్టతను పొందిన ఈ వచనములను, ఇదే శైలిలో మార్చిన ఆంధ్ర లోకనమున కొక క్రొత్త పద్ధతి తెలియ గలదను అభిప్రాయముతో, కన్నడ ధాటిని మార్చక, ఆంధ్రమున పరివర్తన మొనర్చితిని. కన్నడ వచనముల యందు అక్కడక్కడగల సంస్కృత శబ్దములను చాలావరకు మార్చక అటులే ప్రయోగించితిని. కన్నడ నానుడులను సాధ్యమగు నంత వరకు వాడుక యందుండు తెలుగు పదముల లోనే మార్చితిని. అక్కడక్కడ వచనములయందు పటుత్వమును దెచ్చుటకై అచ్చ తెనుగు పదములను గూడా వాడితిని. మొత్తముపై సాధ్య మగు నంతవరకు అందరకు తెలియు నటులు సులభ శైలిలో అనువాద మొనర్ప ప్రయత్నించితిని.

ఈ ప్రకారముగా దయా మయుడగు పరమేశ్వరుని కృపవలన నేను నా తలంపును పూర్తి చేసి ఆ మహోదయుని జన్మదినోత్సవ కానుకగా సమర్పింప గలిగితిని. కాని, ఆంధ్ర భాషామతల్లికి ఇది నా ప్రథమ సేవ గనుక, ఇం దనేక తప్పు లుండిన నుండును. ప్రాజ్ఞులు క్షమించి దెల్పిన పునర్ముద్ర ణము నందు సవరించు కొనుట యే గాక, వారికి కృతజ్ఞుడగా నుండెద.

పండితవర్యులును, వేదకావ్యస్మృతి తీర్థలును, విద్యానిధి, విద్యా రత్న బిరుదాంకితులును, 'విభూతి' పత్రికా సంపా

దకులును, అగు పండిత శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారు దయతో నా యనువాదమును ఆద్యంతముగా జూచి తప్పులను దిద్ది యొసగుటయే కాక అత్యంత మహత్త్వముగల 'కించిత్' వాక్యములను వ్రాసి యొసగి నందులకు వారికి నా కృతజ్ఞతా పూర్వక వందనములను దెలుపు చున్నాము.

వృష సంవత్సర
వైశాఖ శుద్ధ ౩.

ఇట్లు
**రే. మ. వీరయ్య**



# కృతజ్ఞత.

బసవని తత్త్వముల ప్రచారమే తన జీవితముయొక్క ముఖ్యధ్యేయముగా తలంచిన, నా ప్రియ మిత్రులగు, తాండూరు నివాసులు, శ్రీ హేహూరు రాచప్పగారు తమ పితామహులును, వీరశైవధర్మాభిమానులును, గురులింగజంగమ ప్రియులును అగు కై. వా. హేహూరు సిద్ధరామణ్ణగారి స్మరణార్థము నా యీ అనువాదమును అచ్చొత్తించి ప్రకటింపబడుట కవకాశ మొసగి నందులకు వారికి నా కృతజ్ఞతను తెలుపు చున్నాను.

రే. మ. వీ.



గ్రంథ సహాయ్యకుల తాతగారు

శ్రీ కై. వా. సిద్ధ రామణ్ణగారు.

ఓం

# బసవ వచనామృతము.



౧. ఉదకమునం దణచిన అగ్నివలె నుండెను. శశి యందలి రసపు రుచివలె నుండెను. మొగ్గ యందలి పరిమ ళమువలె నుండెను. కూడలసంగమదేవుని నెలవు కన్నె స్నేహమువలె నుండెను.

౨. భవబంధనము భవపాశమైన కారణమేమయ్యా! తొలిజన్మమున లింగమును మరచితిగాన, తొలిసంపదలో జంగముని మరచితిగాన. తెలియుచో నీ సంసారమును మోయ నెంతునా కూడలసంగమదేవా!

౩. చంద్రునివలె కళ సమకూడియుండె నాకు. సంసార మను రాహువు సర్వగ్రాసియై మ్రింగెనయ్యా! నేను నాదేహ మునకు గ్రహణమయ్యెను. ఇక నెన్నడు మోక్షమగునో కూడల సంగమదేవా!

౪. పల్లకి నెక్కిన శునకమువలె, చూచిన విడువదు వెనుకటి గుణమును. తగులబెట్టు మీ మనమును, అది విష యము వైపు లాగును. మృడ! నిన్నను దినమును స్మరియింప నీయదు. నా యొడయడ, కూడలసంగమదేవా, నీ చరణముల స్మరించునటుల కరుణింపుము. ఒడి జాపి వేడెద నీధర్మము.

౫. తన ఇచ్ఛను నుడివిన మెచ్చును ఈ మనము.

ఇచ్చకు ప్రతి బలికిన మెచ్చదీ మనము. కూడలసంగని శరణుల మెచ్చని మనమును చిచ్చులో బెట్టుము.

౬. విషయమను పచ్చికను నా ఎదుట దెచ్చి బడవైచితివి తండ్రీ! పశు వే మెరుగును? పచ్చిక యని మచ్చికతో మేయును. విషయ రహితునిగా జేసి, భక్తిరసమును తనివిదీర నొసగి, సుబుద్ధియను నీటిని జూపి బ్రోవుమయ్యా కూడల సంగమదేవా.

౭. ఒక్క పశువు బురదలో జిక్కిన, కాళ్లు కొట్టుకొనుటయేగాక, వేరే గతి గలదా? శివ, శివా! చచ్చితి, చచ్చితినయ్యా! నీ మనము వైపు నన్ను లాగుకొను మయ్యా! పశువు నేను, పశుపతి నీవు. దొంగదూడ యని నన్ను పట్టి కొట్టుటకు మునుపే, ఒడయుడా, నిన్ను తిట్టనటుల జేయుము కూడలసంగమదేవా.

౮. నీవు బుట్టించిన చోట బుట్టి, నీవు గిట్టించిన చోట గిట్టకుండుటకు నా వశమా? అయ్యా, నీ వుంచిన చోట నుండక నా వశమా? అకటకటా, నన్ను నీవానిగా జూడుము కూడల సంగమదేవా.

౯. నరవింధ్యయందు నన్నొక చిలుకగా జేసి పెంచుచు, శివ శివా యని పలికించుమయ్యా. భక్తియను పంజరమం దుంచి పెంచుమయ్యా కూడలసంగమదేవా.

౧౦. అటు నిటు దిరుగ నటుల, కుంటిని జేయుము తండ్రీ! చుట్టు ప్రక్కల చూడ నటుల, గ్రుడ్డిని జేయుము తండ్రీ! మఱియొకటి విననటుల, చెవిటిని జేయుము తండ్రీ! నీ శరణుల

పాదము తప్ప ఇతర విషయములకు బోనటుల నుంచుము కూడలసంగమ దేవా!

౧౧. నా బాగోగులు మీ వయ్యా! నా వృద్ధి క్షయలు మీ వయ్యా! నా మానాపమానములు మీ వయ్యా! తీగకు కాయ బరువా, కూడలసంగమ దేవా?

౧౨. నీవు తలచిన మొద్దు చిగురించునయ్యా! నీవు తల చిన గొడ్రాలు పాలిచ్చునయ్యా! నీవు తలచిన విషమంత యమృతముగునయ్యా! నీవు తలచిన సకల పదార్థము లిచటనే యుండును కూడలసంగమ దేవా.

౧౩. కుండల జేయునెడల మన్నే మొదలు. తొడవుల జేయునెడల హొన్నే మొదలు. శివపథము తెలియునెడల గురుపథమే మొదలు. కూడల సంగమ దేవుని తెలియునెడల శరణుల స్నేహామే మొదలు.

౧౪. గురు వచనము లేక లింగ మనబడదు. గురు వచనము లేక నిత్య మనబడదు. గురు వచనము లేక నియమ మనబడదు. తలలేని మొండెమునకు పట్టము గట్టు ఉభయ భ్రష్టుల మెచ్చునా కూడలసంగమ దేవుడు?

౧౫. జలమునకు కలువలే శృంగారము. సముద్రమున కలలే శృంగారము. నారికి గుణమే శృంగారము. గగనమునకు చంద్రుడే శృంగారము. మా కూడలసంగని శరణుల నొసటికి విభూతియే శృంగారము.

౧౬. అయ్యా, నాకు రుద్రాక్షయే సర్వపావనము. అయ్యా, నాకు రుద్రాక్షయే సర్వసిద్ధి. అయ్యా, నీ పంచముఖ ములే పంచముఖరుద్రాక్షు లగుటచే, కూడలసంగమ దేవా,

నా ముక్తిమార్గమున కీ రుద్రాక్ష సాధన మయ్యా!

౧౭. కరి భయపడు నంకుశమునకు, గిరి బెదరును కులిశ మునకు, చీకటి భయపడును జ్యోతికి, అడవి వెరచు నగ్నికి, పంచమహాపాతకములు భయపడును కూడలసంగమదేవుని నామమునకు.

౧౮. నా మనమున వేరొకటి దెలియనయ్యా! "ఓంనమః శివాయ" "ఓం నమః శివాయ" యనుచుంటి నయ్యా! నా కిదియ మంత్రము, నా కిదియ తంత్రము, నా కిదియ జపము. కూడలసంగమదేవా, నీవే ఎరుగుదువు. ఓ లింగమా!

౧౯. * వేద వేదాంతముల కసాధ్యమగు అనుపమ లింగమును తెచ్చి ఇచ్చెనయ్యా, సద్గురువు నా కరస్థలమునకు. నాద బిందు కళల కభేద్యమగు అచలిత లింగమును దెచ్చి యిచ్చెనయ్యా, సద్గురవు నా కరస్థలమునకు. వాఙ్మనముల కగోచరమగు అఖండిత లింగమును దెచ్చియిచ్చె నయ్యా, సద్గురువు నా కరస్థలమునకు. ఇక నే బ్రతికితిని, నే కోరిన కోర్కె లభించెను కూడలసంగమదేవా.

౨౦. అడ్డ విభూతి లేనివారి ముఖము అడవి, చూడ రాదు. లింగదేవుడు లేని చోటు నరవింధ్య, పోరాదు. శివ భక్తుడు లేని యూరు వట్టి పాడు, కూడలసంగమదేవా.

౨౧. లోన కుటిలము, పైన వినయమును జూపి భక్తు లనిపించుకొను వారి నొల్లడయ్యా లింగదేవుడు. వారు పథ మునకు జెల్లరు చెల్లరయ్యా! అంతరంగ బహిరంగముల యందొ

---

* ఈ వచనము శ్రీ మంజప్ప హర్డేకర్ గారు "వ్రాసిన బసవ చరిత్ర" నుండి గ్రహింప బడినది.

కటి గాని వారి నటు బారద్రోలు నయ్యా కూడలసంగమ దేవుడు.

౨౨. మా వారడిగిన శుభలగ్న మనుడయ్యా! రాశి కూటము, ఋణ సంబంధము గలదని చెప్పుడయ్యా! చంద్ర తారా బలము గలదని జెప్పుడయ్యా! రేపటి కన్న నేడె ఉత్తమ మని చెప్పుడయ్యా! కూడలసంగమదేవుని పూజించిన ఫలము మీదయ్యా.

౨౩. ఇంటిలోపల ఇంటియొడయుడు గలడో, లేడో? ఇంటివాకిట గడ్డి మొలచి, ఇంటిలోపల దుమ్మునిండిన, ఇంటి లోపల ఇంటి యొడయుడు గలడో, లేడో? తనువు సందబద్ధము నిండిన, మనమునందు విషయము నిండిన, ఇంటిలోపల ఇంటి యొడయుడు లేడు కూడలసంగమదేవా.

౨౪. రేగాకువలె లోపల నొకటి బైట నొకటి యుండిన మెచ్చునా? రాని భవముల రప్పించునేకాని మెచ్చునా? ఘోరనరకమును బొంద జేయునేకాని మెచ్చునా? ఉడుము నాలుకవలె రెండైన కూడలసంగయ్యమెచ్చునా?

౨౫. భక్తుల జూచిన బొరగిల పడుదురయ్యా! శ్రమ ణుల జూచిన బత్తుల యగుదురయ్యా! విప్రుల జూచిన హరిని స్మరింతురయ్యా! వారివారిని జూడ వారివారివలె. అంకులాడికి పుట్టినవారిని జూపకయ్యా! కూడలసంగమదేవుని పూజించి, అన్యదేవతల మ్రొక్కి, భక్తులనిపించుకొను అజ్ఞానుల నేమందు నయ్యా!

౨౬. భర్త శివలింగదేవుని భక్తుడు. భార్య మారెమ్మ మైసమ్మల భక్తురాలు. భర్త గైకొనునది పాదోదక ప్రసా

దము. భార్య తినునది మద్య మాంసము. భాండభాజన శుద్ధి లేనివారి భక్తి సురాభాండమును బైట కడిగినటుల, కూడల సంగమదేవా.

౨౭. శివజన్మము నందు బుట్టి, లింగైక్యులై, తమ యంగముపై లింగముండగ; అన్యుల వేడి, అన్యుల పొగడి, అన్యుల వచనముల గొనియాడిన కర్మ విడువదు. భవబంధనము శ్వానయోని యందు వచ్చును తప్పక. ఈ కారణము వలన, కూడలసంగమదేవా, నిన్ను నమ్మియు నమ్మని డాంభికుల గతి ఇసుక గోడను నీటితో కడగి నటులయ్యా!

౨౮. అయ్యా! పుట్టను గొట్టిన, పాము జావగలదా? అఘోర తప మొనర్చిన నేమి? అంతరాత్మ శుద్ధి లేనివారి నెట్లు నమ్మునయ్య కూడలసంగమదేవుడు?

౨౯. చిలుక చదివి ఫలమేమి? పిల్లి రాకను చెప్ప జాలదు. జగమెల్ల చూచు కన్ను తనపైనుండు పాపను గన జాలదు. ఇతరుల గుణమును తెలిసికొంటి మనువారు తమగుణమును తామరయరు, కూడలసంగమదేవా.

౩౦. పండుగకు తెచ్చిన మ్రొక్కుబడి గొఱ్ఱె తోరణమునకు తెచ్చిన పచ్చ నాకుల మేసెను. చంపెదరని దెలియక పాడొడలిని మోయుచున్నది. అది యానాడె పుట్టెను. అది యానాడే గిట్టెను. చంపిన వారుండిరా, కూడలసంగమదేవా!

౩౧. పామునోటి యందుండెడి కప్ప ఆకలిచే నెగురు ఈగకై ఆస పడినటులు, శూలముపై నెక్కబోమొదొంగ పాలు నెయి ద్రావి ఎంత కాలముండ గలడో? పాడు దేహమును మెచ్చి కడు అబద్ధములాడి ఒడలిని పెంచువారిని కూడల

సంగమదేవుడు మెచ్చడు చూడన్న!

౩౨. పాము గరిచినవాని పలుకరింపగవచ్చు. విషము మెక్కినవాని పలుకరింపగవచ్చు. ధనమద మెక్కినవాని పలుకరింపరాదు, చూడయ్యా! ధన ముడిగిన వెంటనె పలుకరింతురయ్యా కూడలసంగమదేవా.

౩౩. సార సజ్జనుల సంగము లెస్స చూడుమయ్యా! దూర దుర్జనుల సంగమది భంగమయ్యా! సంగములు రెండు గలవు. ఒకటి విడిచి ఒకటి జేయుము. మంగళమూర్తి మా కూడలసంగని శరణులు.

౩౪. మాలవాడు జ్ఞానియైన, వానికడ నుండుట లెస్స చూడుమయ్యా! తెలివి దప్పక లింగ శరణునడయ్యా! తెలివి జెడకుడు, శివ శరణునడయ్యా! మన కూడలసంగని మహాలయమున మాదిగ చన్నయ్య జ్ఞానియయ్యా!

౩౫. లెస్స యనిపించుకొని ఐదు దినములు బ్రదికిననేమి? లెస్స యనిపించుకొని నాల్గు దినములు బ్రదికిననేమి? లెస్స యనిపించుకొని మూడు దినములు బ్రదికిననేమి? లెస్స యనిపించుకొని రెండు దినములు బ్రతికిననేమి? "జీవితం శివ భక్తానాం వరం పంచ దినానిచ, అజకల్ప సహస్రేభ్యో భక్తి హీనంతు శాంకరీ!" యనురీతి కూడలసంగమదేవుని శరణుల వచనములందు లెస్స యనిపించుకొని ఒకరోజు బ్రదికినను సరియే.

౩౬. మర్త్యలోక మనునది కర్తయొక్క కర్మశాలయయ్యా! ఇక్కడ చెల్లువారక్కడను చెల్లుదురయ్యా! ఇక్కడ చెల్లనివారక్కడను చెల్లరయ్యా, కూడలసంగమదేవా!

౩౭. గడ్డము తెల్లనై, చెంపలు చొట్టలై, శరీరము కృశింపకమున్న; పండ్లూడి, వెన్నువంగి, పరాధీనము కాక మున్న; మోకాళ్లపై చేతులు మోపి, కట్టబట్టక మున్న; ముదిమిచే వంగకమున్న; మృత్యువుముట్టకమున్న కూడల సంగమదేవుని పూజించుము.

౩౮. ఓ రోరి మానవా! అడియాస కూడదు. చీకటి, వెన్నెల, సిరులు స్థిరములు గావు. కీడులేని పదవి. కూడల సంగమదేవుని మరువక పూజింపుము.

౩౯. నాదప్రియుడు శివుడని యందురు, నాదప్రియుడు గాడయ్యా శివుడు. వేదప్రియుడు శివుడని యందురు, వేద ప్రియుడు గాడయ్యా శివుడు. నాదము జేసిన రావణునికి అర్ధా యుష్య మయ్యెను. వేదము జదివిన బ్రహ్మ శిరము ఛేదింప బడెను. నాదప్రియుడును గాడు. వేదప్రియుడును గాడు. భక్తి ప్రియుడు మా కూడలసంగమదేవుడు.

౪౦. తన్నాశ్రయించిన స్త్రీతో రతిసుఖమును, తా భుజించు భోజనమును ఇతరులతో జేయింపవచ్చునా? తన లింగమునకు జేయు నిత్యనియమములు తా జేయక ఇతరులతో జేయింపవచ్చునా? నిరర్థకముగ ఉపచారమునకై జేయువారే గాక నిన్నెట్లు తెలియుదురు కూడలసంగమదేవా?

౪౧. బండెడు పత్రిని దెచ్చి, చూచిన చోటులనెల్ల అభి షేక మొనర్తురయ్యా! తాపత్రయముల బోనాడిపూజించుడు. లింగము తాపత్రయముల నొల్లదు. కూడలసంగమదేవుడు పట్టి నీటియందే మునుగునా?

౪౨. గీతము పాడిన నేమి? శాస్త్రపురాణముల వినిన నేమి? వేద వేదాంతముల జూచిన నేమి? మనముతో లింగ జంగమముల పూజింప నరయని వా రన్నిటియం దనుభవము గల వారైన నేమి? భక్తి లేనివారి నొల్లడు కూడలసంగమ దేవుడు.

౪౩. రాతి నాగుల జూచిన పాలు బోయు మందురు. దిట్టమగు పాముల జూచిన చంపు మందురయ్యా! ఆకొన్న జంగముడు వచ్చిన పొమ్మందురు. తినజాలని లింగమునకు నైవేద్య మిడు మందురయ్యా! మా కూడలసంగని శరణుల జూచి ఉదాసీనపడిన, గట్టుకు దాకిన పెల్లవలె నగుదురయ్యా.

౪౪. తనువు నిచ్చి గురువును వశ పరచుకొనవలయును. మనము నిచ్చి లింగమును వశ పరచుకొనవలయును. ధనము నిచ్చి జంగముని వశ పరచుకొనవలయును. ఈ మూటికి దూరుడై, నిజమును విడిచి, చిహ్నమును పూజించువారిని మెచ్చడు కూడలసంగమ దేవుడు.

౪౫. ఆడిన నేమి, పాడిన నేమి, చదివిన నేమి; త్రివిధ దాసోహములు లేకుండిన? ఆడదా నెమలి, పాడదా తంతి, చదువదా చిలుక? భక్తి లేనివారిని మెచ్చడు కూడలసంగమ దేవుడు.

౪౬. శాస్త్రమును ఘన మందునా? కర్మను పొగడును. వేదమును ఘన మందునా? ప్రాణి వధను జెప్పును. స్మృతిని ఘన మందునా? ముం దునుచి వెదుకును. అట నెక్కడను నీవు లేని కారణమున, త్రివిధ దాసోహమునందు గాక ఇతరమునందు గానరావు కూడలసంగమ దేవా.

౪౮. పాపిధనము ప్రాయశ్చిత్తమునకే గాని, సత్పాత్రమునకు చెల్లదయ్యా! కుక్కపాలు కుక్కకేగాని, పంచామృతమునకు జెల్లవయ్యా! మా కూడలసంగని శరణులకు జెందని అర్థము, వ్యర్థము చూడయ్యా.

౪౯. నే జేసితి నని మనమున గర్వించిన, శపించి పీడించును శివుని డమరువు. చేసితి ననకుము లింగమునకు. చేసితి ననకుము జంగమునకు. చేసితి ననునది మనమున లేకుండిన అడిగిన దిచ్చును కూడలసంగమదేవుడు.

౫౦. దొంగిలింప బోకు, హింసింప బోకు, అబద్ధమాడ బోకు, కోపపడ బోకు, అన్యుల జూచి అసహ్య పడబోకు, తన్ను వర్ణించుకొన బోకు, ఎదురు తిట్ట బోకు, ఇదియే అంతరంగ శుద్ధి. ఇదియే బహిరంగ శుద్ధి. ఇదియే మా కూడల సంగమదేవుని మెప్పించువిధము.

౫౧. దేవలోక మర్త్యలోక మనునవి వేరే లేవు తెలియుడు! సత్యము నుడువునదే దేవలోకము. అసత్య మాడునదే మర్త్యలోకము. ఆచారమే స్వర్గము. అనాచారమే నరకము. కూడలసంగమదేవా మీరే ప్రమాణము.

౫౨. పుణ్య పాపంబు లనునవి తమ ఇష్టము చూచితిరా! అయ్యా యనగ స్వర్గము. అరే యనగ నరకము. దేవ, భక్త, జయ, జీయ! అను పలుకులందే కైలాస పదవి గలదు కూడల సంగమదేవా.

౫౩. "ఏమి, వచ్చితిరి?" "పదిలముగ నుంటిరా!" యనిన మీ ఒడలి సిరి పారి పోవునా? కూర్చుండు డనిన నేల

క్రుంగి పోవునా? ఇయ్యజాలనిచో, ఒక గుణమైనను లేకుండిన ముక్కు గోయక మానునా మా కూడలసంగయ్యా.

౫౩. కన్న భక్తులందరికి కేలు మోడ్పు నతడే భక్తుడు. మృదు వచనములే సకల జపములు. మృదు వచనములే సకల తపములు. సద్వినయమే సదాశివుని వలపు. కూడలసంగయ్యా అట్లు కానివారి నొల్లడయ్యా.

౫౪. దయలేని ధర్మమదేదయ్యా? దయయే కావలయు సకల ప్రాణులలో నెల్ల. దయయే ధర్మమునకు మూలమయ్యా! కూడలసంగయ్యా అట్లుగాని వారిని ఒల్లడయ్యా.

౫౫. తనను కోపించువారిపై, తా కోపపడు టెందుల కయ్యా. తనకైన వంటపేమి, వారికైన వంటపేమి? తనువు యొక్క కోపము తన పెద్దతనమునకు కీడు. మనము యొక్క కోపము తన తెలివికి కీడు. కూడలసంగమదేవా, ఇంటిలోని చిచ్చు ఇంటిని కాల్చికదా, పొరుగింటి నంటుకొనుట!

౫౬. ధృతి జెడి అన్యుల వేడనటుల, మతి జెడి పరుల పొగడనటుల, మనము చెడి పరసతిని కోరనటుల, శివపథ మొల్లనివారితో కూడియుండ నటుల, అన్యజాతివారి స్నేహము లేనటుల నన్ను గాపాడుము కూడలసంగమదేవా.

౫౭. సెట్టి యందునా సిరియాళుని? మడివాలు డందునా మాచయ్యను? మాదిగ యందునా చెన్నయ్యను? డోహరు డందునా కక్కయ్యను? నేను బ్రాహ్మణుడ ననిన కూడల సంగయ్య నగునయ్యా!

౫౮. అప్ప మా మాదిగ చన్నయ్యా, తాత మా డోహర కక్కయ్యా, చిక్కయ్యా మా యయ్యా చూడు డయ్యా,

అన్న మా కిన్నర బొమ్మయ్య, సన్నేల గుర్తింపరు కూడల సంగమదేవా!

౫౯. పట్టుబట్టల ధరించి పూజ్యుడై వచ్చిన జంగముని విశేషుడని తలచి, గంతబొంతల జంగముడు వచ్చిన హీనుడని తలంచినచో పంచమహాపాతకములు. దీనివలన అన్న వస్త్ర ధన సేవలయందు వేరుగా జూతునేని, నరకమున ముంచును కూడలసంగమదేవుడు.

౬౦. గుఱ్ఱము పైనెక్కి ఛత్రచామరములతో వచ్చెటి వారిని జూచిన, పొరలాడుచు కాలు బట్టుదురయ్యా! బీద భక్తుడు వచ్చిన అన్నము లే దటుపొ మ్మందురయ్యా! నా యొడయుడు, కూడలసంగయ్య, వారిని బడవైచి ముక్కు గోయక మానునా?

౬౧. తరువునకు వేరు నోరని పాదులో నీరు బోసిన, పైన పల్లవించెను కాంచితివా! లింగముయొక్క నోరు జంగముడని నైవేద్య మిడిన ముందు సకలార్థ మొసగును. ఆ జంగముని హరునిగా గాంచి, నరుడని భావించినచో నరకము తప్పదు చూచితివా, కూడలసంగమదేవా!

౬౨. బంగారమున రవంతయు, చీరయం దొక పోగును, నేటికి రేపటికి వలయు నందునేని నీ యాన, నీ పురాతను లాన. నీ శరణులకే కాక, అన్యము నరయ కూడలసంగమ దేవా.

౬౩. కాకి యొక మెతుకును జూచిన, పిలువదా తనబలగ మును! కుక్కుట మొక కీటకమును జూచిన పిలువదా తన

కులము! నెల్ల శివభక్తుడై భక్తిపక్షము లేకుండిన, ఆ కాకి కోళ్ల కంటె కనిష్ఠుడు కూడలసంగమదేవా.

౬౪. పారు నతడు బంటు గాడు. కోరు నతడు భక్తుడు గాడు. పారకూడదు బంటు. కోరకూడదు భక్తుడు. పారనయ్యా, కోరనయ్యా, కూడలసంగమదేవా!

౬౫. ఎటు జూచిన నటు మనమును బో నిచ్చిన ఆన! నీ యాన!! నీ ప్రమథులాన!! పరవధువును మహాదేవి యందును కూడలసంగమదేవా!

౬౬. పారెడు పామునకు భయపడను. మండెడు మంటకు భయపడను. కత్తి పదనుకు భయపడను. ఒకదానికి భయపడెద. ఒకదానికి భీతి జెందెద. పరస్త్రీ, పరధనమునకు భయపడెద. మున్ను భయపడని రావణు డేగతి చెందెను? భయపడెద నయ్యా, కూడలసంగమదేవా!

౬౭. దేవసహితముగ భక్తు డింటికి వచ్చిన, కాయక మేమని ప్రశ్నింతునేని నీయాన! నీ పురాతనులాన!! తలదండము! తలదండము!! కూడలసంగమదేవా, భక్తుల కులమడిగిన నీ రాణివాస మాన!

౬౮. శ్రీవిభూతి బూయనివారిని, శ్రీరుద్రాక్ష ధరించని వారిని, నిత్య లింగార్చన జేయనివారిని, జంగముడే లింగమని తెలియనివారిని, సద్భక్తుల స్నేహమునం దుండనివారిని కన నియ్యకుము. కూడలసంగమదేవా, ఒడిజాపి వేడెద.

౬౯. అయ్యా! నీ శరణుల దాసోహమునకు నా తను మన ధనములు అలువ నటులొనర్పుము. తనువు దాసోహమున

కుబ్బునటు లొనర్పుము. మనము దాసోహామున లీనమగునటు లొనర్పుము. ధనము దాసోహామునకు జెంది నీశరణుల ప్రసాదమునందు నిరంతర మాడి, పాడి, కూడి, చూచి, భావించి, సుఖించి పరిణామించు నట్లు జేయుము. కూడలసంగమదేవా!

౨౦. తండ్రివి నీవు, తల్లివి నీవు, బంధువు నీవు, బలగము నీవు, నీవు గాక ఇంకెవ్వరు లేరయ్యా! కూడలసంగమదేవా, పాల ముంచుము, నీట ముంచుము.

౨౧. నాకు నీ తలపు గలిగినప్పుడే ఉదయము. నాకు నీ మరుపు గలిగినప్పుడే అస్తమయము. నాకు నీ తలపే జీవనము. నాకు నీ తలపే ప్రాణము. చూచితివా, తండ్రీ, స్వామీ, నా హృదయమందున నీ చరణ ముద్ర నొత్తుమయ్యా! వదనమందు షడక్షరముల వ్రాయుమయ్యా, కూడలసంగమదేవా!

౨౨. నా కాయమును కాడగా జేయుము. నా శిరమును సొరకాయగా జేయుము. నా నరముల తంతుల గావింపుము. నా వ్రేలును పుడకగా జేయుము. ముప్పది రెండు రాగముల పాడుము. ఎదలో నొత్తి వాయించుము కూడలసంగమదేవా!

౨౩. నీవు వలచినదే పుణ్యము. నీవు వలవనిదే పాపము, చూడయ్యా' సకల జగముల యందనుస్యూతుడవై యుంటివయ్యా! నీవు వలచినవాడే నిన్ను దెలియగలడు. "ప్రసాదాద్దేవతా భక్తిః ప్రసాదాద్భక్తిసంభవః । యథాంకుర స్తథా బీజం బీజతో వా యథాంకురః॥" యనురీతి నీవు వలచిన వాడే ధన్యుడు. జగమునకు పావనుడు కూడలసంగమదేవా!

౭౪. భక్తుఁడని ఎటులందునయ్యా, భవి సహవాసము వదలకున్న? మహేశ్వరుఁడని ఎటులందునయ్యా, పరస్త్రీ పర ద్రవ్యముల యందాశ విడువకున్న? ప్రసాదియని ఎటులందు నయ్యా, ఆధివ్యాధి నశింపకున్న? ప్రాణలింగియని ఎటులందు నయ్యా, ప్రాణము స్వస్థిరము గాకున్న? శరణుఁడని ఎటులందు నయ్యా, పంచేంద్రియములు నశింపకున్న? ఐక్యుఁడని ఎటులందు నయ్యా, జననమరణములు రహితము గాకున్న? ఇట్టి వేష, భాష, వ్రతముల నే నెరుగనయ్యా. అఘటితఘటిత వర్త మానము నే నెరుగనయ్యా. మీ శరణుల తొత్తును, భృత్యా చార మొనర్తును కూడలసంగమదేవా!

౭౫. భక్తియను భూమిపై గురువను బీజ మంకురించి, లింగమను ఆకు బుట్టెను. లింగమను ఆకుపై విచారమను పువ్వు బూసెను. ఆచారమను కాయ గాచెను. నిష్పత్తియను పండ య్యెను. నిష్పత్తియను పండు తొడిమె విడిచి పాదులో బడిన, కూడలసంగమదేవుడు తనకు గావలయునని ఎత్తుకొనెను.

౭౬. ఎటు జూచిన నటు నీవే దేవా! సకల విస్తారమగు నాత్మ నీవే దేవా! విశ్వతో బాహు నీవే దేవా. విశ్వతశ్చక్షు నీవే దేవా. విశ్వతో ముఖ నీవే దేవా. విశ్వతఃపాద నీవే దేవా, కూడలసంగమదేవా.

౭౭. ఇద్దరు ముగ్గురు దేవతలని ఉబ్బుబ్బి మాటలాడ కుము. ఒక్కఁడే చూడుసుమీ! ఇద్దరనునది అబద్ధము. కూడల సంగమదేవుడుకాక వేరేదేవుడు లేడనెను వేదము.

౭౮. తిని త్రాగుటకే మారికగాని, చంప బ్రతికింప మారికయా? తన కొడుకును యముడు గొనిపోయినప్పు డెటు

పోయిన దా మారెమ్మ? ఇవి రక్షించునా? మా కూడల సంగయ్య కాక ఇంకొక దైవము లేదు.

౭౯. కుండ దేవుడు, చెట్టు దేవుడు, వీధియందలి రాయి దేవుడు, దువ్వెన దేవుడు, విల్లు నారి దేవుడు, తూము దేవుడు చూచితిరా! దేవుడు దేవుడని కాలిడ చోటు లేదు! దేవు డొక్కడే మా కూడలసంగమదేవుడు.

౮౦. నుడివిన నుడుగుల నమ్మి నన్ను చంపెదరని, ఓ మేకా, దుఃఖపడితివా! వేదమును జదివినవారి ఎదుట దుఃఖింపుము. శాస్త్రమును వినినవారి ఎదుట దుఃఖింపుము. నీ వేడ్చి నందులకు దగురీతి చేయును కూడలసంగమదేవుడు.

౮౧. నీటిని జూచిన మునుగుదురయ్యా! చెట్టును జూచిన చుట్టు తిరుగుదురయ్యా! ఇంకు జలమును, ఎండు చెట్టును మెచ్చిన వారు, నిన్నెట్లు తెలియగలరు కూడలసంగమదేవా.

౮౨. చంపునతడె మాదిగ, మలినమును దినునతడే మాల. కులమేమో? ఎవరి కులమేమియో? సకల జీవులకు క్షేమమునే కోరు మా కూడలసంగని శరణులే కులజులు.

౮౩. చతుర్వేది యైననేమి, లింగరహితుడే మాలడు. శ్వపచు డైననేమి, లింగధారియే వారణాసి. వాని నుడి బెడగులే లెస్స. ఆతడు జగమునకు పావనుడు. ఆతని ప్రసాదము నా కమృత సేవనము. “న మే ప్రియశ్చతుర్వేదో మద్భక్తః శ్వపచోపి సన్, తస్మై దేవ స తు గ్రాహ్యః స చ పూజ్యో యథా హ్యయం” కూడలసంగమదేవుని తెలిసి పూజించినతడు మహర్షు నములకన్న అధికుడు. జగమునకు పావనుడు చూచితివా!

౧౪. భక్తిహీనుని దాసోహమును సద్భక్తులు చవి జూడరు. వేపపండ్లు కాకికి ప్రియమగుగాక కోకిల మెక్కబోదు. లింగసంబంధములేనివారి నుడుగు కూడలసంగని శరణులకు కూడదు.

౧౫. దేవు డొక్కడు నామము లనేకము. పరమ పతి వ్రతకు పతి యొక్కఁడు. అన్యులకు తల యొగ్గినచో చెవిని ముక్కును గోయును. బహుదేవతల ఎంగిలి దినువారి నేమందు కూడలసంగమదేవా?

౧౬. కనుపడువారి నెల్ల మగడను గడుసురాలిని పతివ్రత యనదగునా? లింగప్రసాదమును గొని, ఇతర దైవముల గొనియాడు దుండగీంద్రకు మా కూడలసంగమదేవుడు గండడు.

౧౭. మారెమ్మ, మైసమ్మ లనునవి వేరులేవు కాంచుడు! మారెమ్మ యననేమి? కనులు తప్పి జూచిన మారెమ్మ, నాలుక తప్పి పలికిన, మారెమ్మ. మా కూడలసంగమదేవుని స్మరణ దప్పిన మారెమ్మ.

౧౮. ఏటిలో మునుగు అన్నలారా! ఏటిలో మునుగు స్వాములారా! వదలుడు! వదలుడు!! పరనారీ సంగమును వదలుడు. పరధనాపేక్షను వదలుడు. వీనిని వదలకయే నీటిలో మునిగిన రాగిల పుణ్యము రాదు, కూడలసంగమదేవా.

౧౯. చూడ వలదు. పలుకరింప వలదు పరస్త్రీలను. కూడదు చూడుడు! గోత్రైపోతువెంట నంటు శునకమువలె వలదు చూడుడు! ఒక యూసకొరకేగిన వేయేండ్లు నరకమునందు ముంచును కూడలసంగమదేవుడు.

౯౦. దాసీపుత్రుడైనను, వేశ్యాపుత్రుడైనను, శివ దీక్ష యైన పిదప సాక్షాత్ శివుడని వందన మొనర్చి, పూజించి, పాదోదక ప్రసాదముల గైకొనుటయే యుచితము. ఇట్లుగాక ఉదాసీన మొనర్చి విడుచువారికి పంచమహా పాతకములును, నరకమును గలుగును. చూచితివా, కూడలసంగమ దేవా!

౯౧. నూరు చదివి, నూరు వినిననేమి? ఆశ విడవదు. రోష ముడుగదు. అభిషేక మొనర్చి ఫలమేమి? నుడివలె నడకలేని జాతి దొమ్మరల జూచి, నగును మా కూడలసంగమదేవుడు.

౯౨. పట్టుండవలయును, శరణులకు పరధన మొల్ల ననునట్టి. పట్టుండవలయును, శరణులకు పరసతి నొల్లనునట్టి. పట్టుండవలయును, శరణులకు పరదేవత నొల్లననునట్టి. పట్టుండవలయును, శరణులకు లింగజంగమము లొకటి యనునట్టి. పట్టుండవలయును, శరణులకు పరవాద నిగ్రహమునందు. పట్టుండవలయును, శరణులకు ప్రసాదము దిటమని. పట్టు లేని వారిని మెచ్చడు కూడలసంగమదేవుడు.

౯౩. రేపు రానున్నది మనకు నేడే రాని! నేడు రానున్నది మన కిపుడే రాని! దీని కెవరు భయపడుదురు? దీని కెవరు వణకుదురు? "జాతస్య మరణం ధ్రువం" యను రీతి కూడలసంగమదేవుడు వ్రాసిన వ్రాతను తప్పింప హరిబ్రహ్మాదులకు నలవి గాదు.

౯౪. నేను వ్యవసాయ మొనర్తునయ్యా గురుపూజ కని. నేను వ్యవహార మొనర్తునయ్యా లింగార్చన కని. నేను పరసేవ యొనర్తునయ్యా జంగమదాసోహమున కని. నే నేయే కర్మల జేసినను, ఆయా కర్మల ఫలభోగముల నీవే యొసగెదవని ఎరుగుదును. నీ వొసగిన ద్రవ్యము నీకుగాక ఇంకొక పని కీయను. నీ సొమ్మును నీ కర్పింతును. మీ యాన, కూడలసంగమదేవ.

౯౫. దేవ, దేవ! విన్నప మవధరింపుము. విప్రుడు మొదలు అంత్యజునివరకు శివభక్తులగువారి నందరి నొకటే యందును. బాపడుమొదలు శ్వపచుని వరకు భవియగు వారినందరి నొకటేయందును. ఇది యిటులే యని నమ్మును నా మనము. నే నాడిన నుడువులందు నూగొనయంత సందేహ ముండిన, పండ్లూడ బెరికి, ముక్కుగోయుము కూడలసంగమదేవా.

౯౬. నాకన్న పిన్నలు లేరు, శివభక్తులకన్న పెద్దలు లేరు. నీ పాద సాక్షి, నా మన స్సాక్షి, కూడలసంగమ దేవా, నా కిదియ శ్రేష్ఠము.

౯౭. మలినమగు రక్తమాంసములందే పిండమున కాశ్రయము గలదు. జలబిందువుల వ్యవహార మొక్కటియే. ఆశ, మిష, రోష, హర్ష, విషయాదులెల్ల నొక్కటియే. ఏది జదివి, ఏది వినిన నేమి ఫలము? కులజుడ ననుట కేమి దృష్టాంతము? “సప్తధాతుసమం పిండం। సమయోనిసముద్భవం। ఆత్మజీవసమాయుక్తం। వర్ణానాం కిం ప్రయోజనం॥” యను రీతి కాచి కమ్మరియయ్యె, ఉదికి చాకలియయ్యె, నేసి సాలె యయ్యె, వేదము జదివి విప్రుడయ్యె. కర్ణమునందుండి జన్మిం

చినవారు గలరా జగమునందు? ఈ కారణము వలన, లింగాంగ సామరస్యము తెలియువారే కులజులు.

౯౮. జగమంత, మొగులంత, మిగులంత, మీ యంత, పాతాళమునకన్న అటు మీ శ్రీచరణము. బ్రహ్మాండమున కన్న అటు మీ శ్రీముకుటము. అగమ్య, అప్రమాణ, అగోచర, అప్రతిమ, లింగమా! కూడలసంగమదేవా, నా కరస్థలమునందు దిగి చులకనైతివయ్యా!

౯౯. మలినము గలదా లింగ మున్నచోట? కులము గలదా జంగము మున్నచోట? ఎంగిలి గలదా ప్రసాద మున్న చోట? అపవిత్రమైన మాటను నుడువు సూతకమే పాతకము. నిష్కళంక, నిజైక్య, త్రివిధ నిర్ణయ, కూడలసంగమదేవా, నీ శరణులకు కానిది లేదు.

౧౦౦. పండితుడైనను, మూర్ఖుడైనను, సంచితకర్మము ననుభవింపనిదే విడువదు. ప్రారబ్ధకర్మను భోగించనిదే పోదని, శ్రుతులు చాటుచునున్నవి కాంచితివా! తానే లోకమున, నుండినను విడువదు. కర్మఫలమును గూడి కూడలసంగమదేవునికి ఆత్మనైవేద్య మొసగునతడే ధన్యుడు.

౧౦౧. సిరిగలవారు శివాలయము గట్టింతురు. నేనేమి జేయగలుగుదు బీదనయ్యా. నా కాలే కంబము, నా దేహామే దేవళము, శిరమే స్వర్ణకలశమయ్యా. కూడలసంగమదేవ, వినవయ్యా! స్థావరమునకు చెరుపు గలదు. జంగమునకు చెరుపు లేదు.

౧౦౨. తనువు మీాదైన పిదప, నాకు వేరు తనువు లేదు. మనము మీాదైన పిదప, నాకు వేరు మనములేదు. ధనము మీాదైన పిదప, నాకువేరు ధనములేదు. ఇట్లీ త్రివిధము మీాదని తెలిసిన పిదప, నాకు వేరె విచారము గలదా కూడల సంగమదేవా!

౧౦౩. నేల యొకటే మాలవీధికి, శివాలయమునకు; జల మొకటే శౌచాచమనములకు, కుల మొకటే తన్నుతా దెలిసిన వానికి; ఫల మొకటే షడ్దర్శన ముక్తికి; నెలవొకటే, కూడల సంగమదేవా, నిన్ను దెలియువారికి.

౧౦౪. చెట్టు చెట్టు రాపిడి వలన, అగ్నిబుట్టి చెట్టును కాల్చ కుండునే? మహానుభావుల సహవాసముచే, జ్ఞానాగ్నిబుట్టి నా తనుగుణమునంత కాల్చదా? దీనివలన మహానుభావుల జూపింపుము కూడలసంగమదేవా.

౧౦౫. భక్తుడ ననబడుదునయ్యా మెల్లమెల్లన. యుక్తుడ ననబడుదునయ్యా మెల్లమెల్లన. నిక్కముగా శర ణుడ ననబడుదునయ్యా మెల్లమెల్లన. పడజేయు వలల దాటి త్వరగా లింగైక్యుడ ననబడుదునయ్యా! కూడలసంగమదేవా, మీాకంటె నధికుడ ననబడుదునయ్యా!

౧౦౬. జగమును చుట్టి యున్నది నీ మాయ యయ్యా! నిన్ను చుట్టి యున్నది నా మనము చూడుమయ్యా! జగ మెరి గినవాడవు నీవు. నిన్నెరిగినవాడను నేను, చూడుమయ్యా! అద్దము నందేనుగు ఇమిడి యున్నటుల, కూడలసంగమదేవా, నాయందు నీ విమిడి యున్నవు చూడుమయ్యా!

౧౦౭. లింగమును పూజించి ఫలమేమయ్యా సమరతి, సమకళ, సమసుఖ మరయకున్న? లింగమును పూజించి ఫలమేమయ్యా! కూడలసంగమ దేవుని పూజించి నదిలోపల నది గలిసి నటుల కాకయున్న?

౧౦౮. అంతరంగము, బహిరంగము, ఆత్మసంగము ఒకటి యయ్యా! నాద, బిందు, కళాతీతుడవు, ఆది యాధారుడవు, నీవే యయ్యా! ఆరాధకూటముయొక్క సుఖమును కూడలసంగయ్య తానె ఎరుగును.

సిటికాలేజి ఆంధ్రాచార్య శ్రీ ఓగిరాల సుబ్బారావు
M. O. L. గారియభిప్రాయము:—

"శ్రీయుత రేకళిగెమరము వీరయ్యగా రాంధ్రీకరించిన "బసవవచనామృతము" ను పొత్తమును బరిచయయుక్తముగా నామూలాగ్రము బఠించితిని. అట్లు పఠించునపుడు నాకుఁగలిగిన యానందమునకు మితిలేదు. ఏ వచనమున కావచనము సార్థముగ శతకపద్యంబులంబోలి ముగియుచు, భవరోగహారకంబగు నమృత ఘుటికయయి యలగారుచున్నది. ఉపనిషద్వాక్యములందును, నిందలి కొన్నికొన్ని యపూర్వ భావంబులు బొడఁగట్టవను కొందును ఈ బసవసుభాషితంబులు రామకృష్ణ పరమహంసాది మహాత్ముల వచనములను మించి, యశ్రుత పూర్వంబులగు నమూల్య భావములతో శోభిల్లుచున్నవి. నైతిక, సామాజి కాధ్యాత్మి కాద్యనేక విశేషంబులను సుబోధకంబుగ బోధించుచు, నీ వచనములు, కేవలము వీరశైవులకేగాక, అన్యమతస్థులు జిజ్ఞాసువులునగు ముముక్షుల కెల్లరకు నత్యంతోప కారకంబులై, భవతారకంబులై యున్నవనుటకేమాత్రము గొంకను.

అక్షరలక్ష వెలఁగట్టఁదగిన సుభాషితంబులలో—౩౯, ౫౮, ౭౦, ౯౭, ౧౦౬, ౧౦౭, సంఖ్యలుగల వానిని ముఖ్యముగఁ బ్రతిజిజ్ఞాసువు చర్విత చర్వణముగ మననిదిధ్యాసలు సేయవలసియున్నది. కన్నడ భాషనుండి యీ బసవ వచనములను సులభశైలిలో, దేటతెలుఁగు నుడులలో ననువదింపఁగలిగిన వీరయ్యగారు నిక్కముగ, బ్రశంసా పాత్రులే. ఇంకను నితోధికముగ శ్రీ వీరయ్యగారు పరిశ్రమించి తక్కుంగల బసవ వచనముల నాంధ్రీకరించి భక్తసంతతి సేవయును నాంధ్రభాషా సేవయును జేయుదురుగాక. ఆంధ్రులెల్లరీ గ్రంథమును దప్పక పఠింపఁదగియున్నది."

---